శ్రీ

# చింతామణీదర్పణము.



ఇది

వసురాయకవి విరచిత మగు

భక్తచింతామణీ పూర్వశతకము ననుసరించి

రాజమహేంద్రవర పురపాఠశాలోపాధ్యాయుఁడగు

చింతపెంట వేంకటరమణయ్యచే

రచింపఁబడినది.



రాజమహేంద్రవరము.

శ్రీమనోరమా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1916

 వెల 2 అణాలు.

తే. గీ. ఈప్సితంబేదొ తనయున కీఁ దలంచి
తన్నుఁగూర్చి పల్కించెడు తండ్రి భాతి
నెలమి భాగవతంబు నాకిడఁ దలంచి
వ్యాస రచనము సేయించి తపుర! యీశ!

క. కరుణను నిజ తనయుని గతి
వరయుచు నన్బ్రోచుచుండువట్టి ఘనుండా
వరసింహాలునకుం దీనిం
బరువడి నే నంకితం బొనర్తును భక్తిన్.

శ్రీరస్తు.

ఇష్టదేవతా ప్రశంసనాదికము.

శ్రీకర సత్కృపారసముచే ధరణీస్థలి భక్తపాదపా
నీకము పుష్టిఁ జెందుగతి నిత్యముఁ బ్రోచెడి కృష్ణమేఘమున్
బ్రాకటలీల నావిమలభావమునం దిడి ప్రస్తుతింతు న
వ్యాకులభక్తి సంతత శుభంబుల సత్కృపమై నొసంగఁగన్.

తే. గీ. కలిత సంస్కృత సుకవీశుఁ గాళిదాసు
నవ్యమధురకవోధుర్యు నన్నయార్యుఁ
బ్రథితగురుచంద్రు భానుసవసుకవీంద్రు
భక్తిఁ బ్రణుతింతు శుచివచఃప్రాప్తికొఱకు.

సీ. ఆంధ్రమండలమున నమరావతీతుల్యమగుచు రాజమహేంద్ర మలరుచుండు
వసురాయపుస్తకభాండార మనియెడు కల్పవృక్షంబొండు కలదు దాన
నంగన నాంధ్రభాషాభివర్ధన యనుసంఘ మొకండు తచ్ఛాఖ యుండు
నందు నుపాధ్యక్షుఁ డద్దంకి సత్యనారాయణ సాంఘికప్రజలఁ బిలిచి

తే. గీ. పుణ్యభక్తచింతామణీ పూర్వశతక
పద్యములలోని భావముల్ ప్రకటముగను
వ్యాసము రచింపుఁ డొసఁగుదు భాగవతము
నంచు మెప్పొందు నతనికి నని వచించె

ఆ. వె. బహుళకృతుల దవిలి పఠియించి యుండ లే
దనుభవంబు కూడ నల్పతమము
భక్తివిషయ మిద్ది ప్రథమయత్నం బప
హాస మొందు నొక్కొ వ్యాస మీదు ?

రాజమహేంద్రవరము.

4-2-1916

ఇట్లు,
విధేయుఁడు,
చింతపెంట వేంకటరమణయ్య.

# పీఠిక

శ్రీమదాంధ్రభాషాభివర్ధనీసమాజమువారు, భక్తచింతామణీ పూర్వశతక మందలి పద్యముల భావము వ్యాసముగా వ్రాయుఁ డనియు, నందు పరీక్షకులచే నామోదింపఁబడిన వ్యాసము వ్రాసినవారికి బహుమానముగా భాగవతగ్రంథ మొసఁగెదమనియు నీవ్యాసమే తత్సమాజ సభ్యులలోనివారు మాత్రమే వ్రాయఁదగిన దనియు నేర్పరించియుండఁగా నే నొక వ్యాసము రచించి యిచ్చితిని. వచ్చిన వ్యాసములలో నావ్యాసమే బహుమానార్హముగ నున్నదని పరీక్షకు లభిప్రాయములిచ్చి నటుల సమాజమువారు నాకు తెలిపినందునఁ బూర్వ వ్యాసమున కొన్నిసవరణలుచేసి యీరూపమునఁ బ్రకటించితిని. చదువరు లిందలి దోషముల మన్నించి గుణలేశము లున్న గ్రహింతురు గాక!

రాజమహేంద్రవరము.
20-2-1916

ఇట్లు, విధేయుఁడు,
చింతపెంట వెంకటరమణయ్య.

☞ చింతామణియని యున్నచోట చింతామణీయని చదువుకొనవలెను.



శ్రీరస్తు.

# చింతామణిదర్పణము.

—

" శ్లో. ప్రహ్లాదనారదపరాశరపుండరీకవ్యాసాంబరీషశుకశౌనక
భీష్మదాల్భ్యాన్। రుక్మాంగదార్జునవసిష్ఠవిభీషణాదీన్
పుణ్యా నిమాన్ పరమభాగవతాన్ స్మరామి॥

సుజనులారా!

భక్తచింతామణిగ్రంథము భక్తచింతామణియే. తన్ను సేవించువారికి భక్తచింతామణి యైహికాముష్మికసుఖంబుల నెల్లప్పుడును ప్రసాదించుచుండును. భక్తచింతామణిగ్రంథము మృదుమధురవచోరచనముచేతను భావౌత్కృష్ట్యముచేతను భక్తిబోధనముచేతను పాఠకుల సనేకుల నానందాంబుధిం దేల్చుచున్నది. అట్టిభక్తచింతామణిగ్రంథమందలివిషయము లతో భక్తచింతామణి యగుభగవంతునిస్మరణము సేసికొనుట మన కెంతయు శ్రేయోదాయకము కదా!

ఇట్టిభక్తివిషయములగుఱించి చర్చించికొనినకాలమే మన జన్మమున నిక్కముగ సాఫల్యము గాంచినది. ఇట్టివిషయము

నుగుణించి వ్యాసరచనముసలుపుటకుఁ గాని, యుపన్యాస మొనరించుటకుఁగాని, గ్రంథవిరచనము గావించుటకుఁగాని విశేషగ్రంథపరిచయమును, మృదుమధురవాగ్ధారయు, విశేషానుభవజ్ఞానమును కావలయు.

వీనిలో నొక్కఁడైనను నాకుఁ గలుగకుండినను భక్తివిషయమగుటచే దీనిప్రసంగమున కియ్యకొంటిని. ఎంత యపూర్ణభావమైన నెంతటియసందర్భార్థబంధమైనను బాలురవాక్యమెట్లు పెద్దలయాదరణము గాంచఁ జాలునో యట్లే నాపలుకులును విద్వద్వర్యులయాదరణము గాంచఁ గలుగు ననితలంచికొనుచుఁ బ్రస్తుతము ననుసరించుచున్నాఁడ.

సర్వశక్తుఁడును సర్వకారణుఁడు నగుసర్వేశ్వరుఁడు కోటిసూర్యప్రభాభాసమానుఁడు. ఆతఁడు సచ్చిదానందస్వరూపుఁడు తనమాయచేతనే సకలప్రపంచములను నిర్మించి రక్షించుచున్నవాఁడు. ఆతఁడుదయకుమహాసముద్రమువంటివాఁడు. అట్టి యాపరాత్పరునిమహిమలను వేదములే వర్ణింపలేవు. మూఢాత్ములము ననుభవజ్ఞులము నైనమన మాయనను గూర్చి యేమి చెప్పఁగలము? ఐనను పేదతనకు పెన్నిధి లభించినప్పు డాసంగతి యాతఁడు సుహృదు లగునిరుగుపొరుగు వారలకెల్లఁ దెలిపి యేవిధముగఁ దృప్తిఁ బొందునో యదే విధముగ నజ్ఞమతుల మయినమనమును మనకు లభించెడు నీ

శ్వరసేవను హృద్యములగు పద్యములచేతను ననవద్యములగు గద్యములచేతను వర్ణించికొని మనతోడివారికిఁ దెలుపుచు నధికసంతోషము బొందుట సహజధర్మము ఈశ్వరుఁడు సర్వ ప్రారంభములకును జీవ మైనవాఁడు. బీజములు వర్షముచే నంకురించి పెరిగి యెట్టు ఫలించునో మనకార్యములును నల్లె యతనిదయచే వృద్ధి నొంది సిద్ధించును. కాఁబట్టి మనము మనకార్యభారము నంతయు నాయనపై నుంచి శక్తివంచ నము లేకుండఁ బురుషప్రయత్నము సేయవలయును. అట్లొన ర్చినయెడల దైవము తప్పక మనసత్ప్రయత్నముల రక్షింపఁ గలఁడు. భయకారణముననో, యాశ్చర్యహేతువుననో, మూఢ తవలననో, వాకట్టుననో మఱి యేకతముననోగాని మనములఁ దోఁచునంశములఁ బూర్ణముగ వెల్లడింప రాకుండును. కాఁబ ట్టి సదా గంగాప్రవాహతుల్యవాగ్ధారకై దైవప్రార్థన మొన ర్చినఁ బ్రవాహశక్తిచే మణులు సముద్రమునఁ జేరునట్లు చక్కని మనయూహలు తద్వాగ్ధాటిచే భగవత్సాన్నిధ్య మును జెందఁ గలవు.

భగవంతుఁ డకారణముగ దయఁ జూపువాఁడు. ఆతఁడు నిత్యుఁడు. నిర్మలమగు మనస్సు గలవాఁడు. సర్వలోకములను సృజించి వానిఁ దనలో నిమిడ్చికొని వానిచే నశ్రాంతమును బేర్కొనఁబడువాఁ డాతఁడే. అతఁడేమెల్లఅయభీష్టములఁదీర్చ

చుండును. ఆతనిసద్గుణము లనంతములు. వానిగొలుచునపుడు మహాసముద్రమునందలి జలబిందువులు గాని పృథ్వియందలి యిసుకరేణువులు గాని యాకాశమునందలి నక్షత్రములుగాని సంఖ్యాంతమునఱకు లెక్కించుచు గుణితులుగా నుంచెడు సలగకాయలకైనఁ జాలియుండు నని చెప్పఁజాలము. పదములపొందికయు, విశేషార్థములయిమిడికయు, భావములస్పష్టతయు, నద్భుతములగుకల్పనములును గలగ్రంథమును బఠించినప్పుడు తత్కర్త నెట్లుశ్లాఘించి పూజించుట కిచ్ఛపొడమునో యట్లె భగవంతునిచే సృష్టింపబడినయీమహాప్రపంచమును గాంచి యందలిమహత్వము నీక్షించినపుడు తత్పరాత్పరుని బూజించుట కెల్లఱ కిచ్ఛకలుగక మానదు. మననాడులే ప్రవాహములు; రోమములే పచ్చిక. ఎముకలే శిలలు. ఇట్లా మహాత్ముఁడు విశ్వస్వరూప మంతయును మనయందు సంక్షేపరూపమున నిమిడ్చి యున్నాఁడు. ఇట్టిమహాద్భుతక్రియలఁ గల్పించినయామేటిని వెఱ్ఱివాఁడైన విడఁజాలునా? ఆభగవంతుఁడే మనలఁ బొద్దున మేల్కొల్పును. పగలంతయు నాతఁడే మనలఁ బ్రేమపూరిత మగునాదరణముతోఁ బెంచును. రాత్రి యాసన్నము కాఁగానే నిదురలో బ్రవేశపెట్టును ఇట్లె యీ బ్రహ్మాండముఁ గూడ నాతఁ డనేకపర్యాయములు సృజించుచు రక్షించుచు లయముచేయుచు వినోదించు

చుండు నని ప్రతిదినము మనకు స్పష్టపడుచున్నది. బాలిక లేరీతిగ నిసుకలో బొమ్మరిండ్లునిర్మించి ముగ్గులుమొదలగు నవి పెట్టికొంచెముకాల మాడుకొని పిదప వాని నన్నిటిని బాడొనర్చి పోదురో యారీతిగనే యాతఁడును సర్వలోకముల సృజించుచు వానిఁ గొంతకాలము పోషించి తుదకు నాశనము సేయుచుండును. అని యాతని కొక వేడుక. సృష్టిస్థితిలయకారణభూతుఁడగుపరమేశ్వరుఁడు బొగ్గును గారమును గంధకమును వలె గొనములఁబాళ్లు వేసి పెద్దపెద్దప్రపంచములను లంకాపురులవలె నిర్మించుచు చిట్టచివఱకు వాని నెల్ల రూపుమాయించి యానందించును. సర్వావయవములనుఁ దనయిచ్ఛననుసరించి యొక్కొక్కప్పుడు బైటికి విప్పుచు వేఱొకప్పుడు లో నిముడ్చికొనుతాఁబేలు వలె నాపరాత్పరుఁడును లోకములనొక్కొక్కప్పుడు బైలుపఱచుచు వేఱొకప్పుడు వానిని మగుడఁ దనలో నిముడ్చుకొనుచుండును. పుట్టయందు చీమలు వలె నాయనయుదరమునం దెన్నియో బ్రహ్మాండము లిమిడి యుండును. ఆసర్వేశ్వరునిసంకల్పమే సృష్టి. ఆతనికటాక్షవీక్షణమే రక్షణము. ఆతనియుపేక్షయే క్షయము. లేనియెడల నీభూతములన్నియు నిక్షేపకారముగ సృష్టిరక్షణములఁ గాంచగలవు. దండము చేఁబూని యధికారి యెదురుగ నిలువబడినను సేవకుఁ డేదో యొకతీరుననతనికన్నుఁ గప్పి ప్రవర్తింపఁగలడు.

కాని యీశ్వరు నొకసారియైనఁ జూడకయే ప్రపంచమంతయు నాతనియాజ్ఞమీఱక ప్రవర్తించుచున్నది. సూర్యుఁ డొకక్షణ మైనఁ దనదినప్రయాణమున నేమఱియుండఁడు. సముద్రము కొంచెమైనను మేర మీఱదు. వాయుదేవుఁడెల్లపుడును గాలి వీచుచునే యుండును. భూమి సకలభారమును సదా మోయు చుండును. కాలానుసారముగ మేఘములు వర్షించుచున్నవి. వీనినెల్లఁ గాంచినపుడు పరమేశ్వరుఁడు చండశాసనుఁడని బోధపడకుండునా? ఈప్రపంచమంతయు నొండొంటికి విరుద్ధ ములగువస్తువులతో నిండియుండియు దగవును ధర్మమును గలిగి వర్థిల్లుట కాధార మాతఁడేకదా! మదమునఁ జెలరేగి సాధుల బాధింతుమని దుర్మార్గు లెంతరేగినను వారి కేయా పదను రానీయక కాపాడువాఁ డాభగవంతుఁడు గాక మ ఱెవ్వఁడు? ధర్మ మేవైపుండిన నావైపున నాజగన్నాథుఁడు సహాయుఁడుగ నుండుఁగావున ఫలభారముచే వంగినవృక్ష మును నిలువబెట్టుటకు నునము బోటొగ్గువిధముగ ధర్మా చరణకారణమున నాపదలఁ బొందుసాధుల కాయీశుఁడే యడ్డుపడుచుండును. వానకుఱియువేళకు మబ్బులుమెఱుపులు గర్జనలు నేరీతిగ సందర్భపడుచున్నవో బాగోగులు వచ్చువేళ లకుఁ దత్కార్యముల కనుకూలములగువిషయము లాతని తంత్రముచేఁ గలుగుచుండును. ఆజగదీశ్వరునకు భూతము

లన్నిఁటియందును సమానమగు ప్రేమ. జాతిలోనుండుకప్పకుఁ గూడ నాతఁడే యాహారముఁ బ్రసాదించుచుండును. వటులు గొందఱు తమగనులయం దమర్చికొనినపురుగుటెక్కలు రాత్రులయందు తళతళమని ప్రకాశించుచుండున ట్లెవరిసాన్నిధ్యప్రభావమున నాకాశమున సూర్యాదిగ్రహములన్నియుఁ దేజోవంతములై వెలుగుచుండునో యట్టితేజోమూర్తియైన పరమేశ్వరుని యాకారము నీక్షించుటకు జ్ఞాననేత్రము గల యోగులుగాక యన్యులు సమర్థు లగుదురా!

కవులకుఁ గవియుఁ బండితులకుఁ బండితుఁ డగునాజగత్ప్రభువు వేదము నొకలక్షణముగను బ్రపంచమును దానికి లక్ష్యముగను నేర్పఱచిమనకొఱ కొకమహాగ్రంథమునునిర్మాణము చేసియున్నాఁడు. ఆగ్రంథమునుసవిమర్శముగాఁజదువుధన్యులు నిస్సంశయమనస్కులై యాతనిమహత్త్వము నెఱుఁగఁగలరు. మనుష్యులు వేఱు వేఱు స్థానములయందున్నను మధ్యాహ్నమున వారికందఱకు సూర్యుఁడేరీతిగనాకాశమునఁ దలకు సూటిగఁ గన్పట్టునో భగవంతుఁ డొక్కఁడేయైనఁ దన్నుధ్యానించువారికెల్ల నకాతఁడదేరీతిగహృదయమునెదుటఁ బ్రత్యక్షమగుచుండును. శరీరమెల్ల ఝల్లని గగుర్పొడువ, సర్వావయవములుపొంగఁగంఠమున గద్గదికవొడమఁ,గాలుసేతులువడక, నానందాశ్రువులు ముత్యములవలెరాల, నప్పరమేశ్వరుని

ధ్యానించునప్పటిసౌఖ్యమును యోగులుగాని యితరు లెఱుఁగనేర్తురా ! భగవంతునిదాసు లనుకారణమున మునీంద్రులును మహారాజులును పాదసేవకులై పూజింతురు. కాఁబట్టి రాజులకు రాజగు భగవంతుని భజించుటవలనఁ గలుగఁగల గౌరవము భూరాజుల నారాధించుటవలన నెన్నఁటికిఁ గలుగఁగనేరదు. సర్వశక్తుఁడగు నీశ్వరుని సేవకులకెందును గొఱతకలుగదు. ఆతని నమ్మకముతోఁ గొలుచునరుఁడు సముద్రమును గాలినడకతో లంఘింపనైనను, బరువైన పాషాణమును దేలింపనైనను, దామరకొలఁకునందువలె దావాగ్నిలోఁ జొచ్చి బయల్వెడలనైనను సమర్థుఁడగును. ఆపరమాత్మునిపదస్మరణము, పాపము లనెడు మహారణ్యముల దహించుట కగ్నివంటిది; శుభకరములైన కార్యారంభములనెడు బీజములఁ బెంచి ఫలింపఁజేయుటకు మేఘమువంటిది; కామరోషాది శత్రువులనెడుపాముల రూపుమాపుటకు గరుత్మంతునివంటిది; కష్టములనెడు గాఢాంధకారమును మాయించుటకు సూర్యోదయమువంటిది ; మోక్షమనెడు నానందమును కలుగఁజేయుటకు మూలకారణమైన దుంపవంటిది. తమ బిడ్డలయందు దోషములున్నను వానిని బైకిరానీయక లోలోపల నడచి యెట్లుతల్లిదండ్రులు వారిని క్షమించుచుందురో యీశ్వరుఁడు నట్లే మనముచేయుప్రతిదోషమును తనదృష్టియం దుంచి

శిక్షింపక మనల క్షమించును. ఆయన మన యాంతరంగిక స్నేహితునివలె యంతరాత్మరూపమున మనకు క్షేమము దెలుపుచుండును. కేవలము ధర్మప్రభువువలె నాతఁడే మన యిబ్బందులఁ దొలఁగించుచుండును. అట్టిదయాళునిఁ గొల్వకుండుట మనదురదృష్టము కాక మఱేమి ? అతఁడు మనల శిక్షించునని భీతితోఁగాక, మనము మొదలగు సకలప్రాణులను సకలవిధముల సదాపోషించెడు నాతని కారుణ్యమును గాంచి యతిప్రేమమున నాతనిఁ గొల్చుట శ్రేష్ఠతరము. ఆమహనీయుఁడు దానములవలనఁగాని, తపములవలనఁగాని, స్నానములవలనఁగాని, జపములవలనఁగాని, తృప్తినొందఁడు. ఆతనిఁ దృప్తిపఱచునది సర్వాంగములయందు గగుర్పాటును గలిగించెడు నిశ్చలమైన భక్తియొక్కటియే. వేసఁగిమధ్యాహ్నమున నెండవేడిమికిఁ దాళఁజాలనిమనుజుఁడు నీడను నీళ్లను మాత్రమే వాంఛించురీతిగ, జననమరణరూపమైన యీసంసారబాధల కోర్వఁజాలని గృహస్థుఁ డాతని పదములనే కోరుచుండును. ఏనుఁగు నారోహించినవాఁడు కుక్కలు మొదలగు తదితరజంతువుల కెట్లుభీతిల్లఁడో జగన్నాథుఁడగుభగవంతుఁడు తనకు సహాయుఁడనియెంచి వర్తించు మనుజుఁ డెట్టికష్టములకును భీతిల్లనక్కఱలేదు. కవచమును ధరించినయెడల యుద్ధరంగమున నది శరీరమునురక్షింపవచ్చును; రక్షింపకపోవచ్చు

నుగాని, హృదయమున భగవంతుని ధరించినవాని కీలోకము నఁగాని యాలోకమునగాని దేనివలనను నేవిధమగుభయమును నిశ్చయముగా నెన్నటికిఁగలుఁగనేరదు. మనసామర్థ్యముగనినను, మనయక్కఱలఁ గాంచినను, మనసంసారమును మనమనస్సులనుమనవిధులను, గాంచినను నాపరాత్పరుని సాంగత్యమును నాతని సాహాయ్యమును ముఖ్యమని తోఁచెడును. ఆతని నెఱుఁగకున్న యెడల మనకు ధర్మకార్యములయందు ప్రవృత్తియు, నధర్మకార్యములనుండి నివృత్తియుఁ గష్టములయందు సహనమును, నాపదలనుండి విమోచనమును, దాపత్రయములందు శాంతియు, జయసంపదయు, సత్యమునం దాసక్తియు, నసత్యమునందు విరక్తియుఁ గలుగవు. ఇఁక ముక్తిగలుఁగదనుమాట నుగూర్చి చెప్పవలసినదేమి? భగవంతుఁడే సర్వప్రాణుల యందు నాత్మస్వరూపుఁడై వెలుఁగుచుండుఁగావున నాతని నెచ్చెలిగఁ జేసికొనినవానికి లోకమున విరోధియుండఁడనుట స్పష్టము. మఱియు నట్టివాని కెచ్చోట నేకష్టమువచ్చినను, నాతఁడు సర్వత్ర నుండుఁగావున వాని నెచ్చోటనైనను సంరక్షింపఁజాలియుండును. లోకమునందు ధనికుఁ డార్జనరక్షణముల చేతను బేదవాఁడు దారిద్ర్యముచేతను సర్వదా దుఃఖమొందుచున్నారు. ధనికులో దరిద్రులో యైనలోకులందఱును నిట్లు దుఃఖమునుమాత్రమే స్వీకరించినందున నానందమ

నునది యీలోకమును విడిచి యీశ్వరసాన్నిధ్యమునే జేరు కొన్నది. కావున మనమెల్లఱ మాతని సేవచేసినయెడల మన సేవకుఁ దగినజీతముగఁ దనకడనున్న యానందము నాతఁడు మనకుఁ బ్రసాదించును. ఆమహామహునికి దయపుట్టుటకై మనము నిశ్చంచలభక్తితో: బెద్దకాలము పూజ సేయవల యును. మనయందు దయవచ్చినయెడల భగవంతుఁ డప్రయ త్నముగనే మన కోరికలన్నియు నొక్కనిముసములో నెరవే ర్పఁగలఁడు. కాఁబట్టిమనయభీష్టసిద్ధివిషయమున దేవునియెడల సందేహింపక తదర్చా సేవావిషయమున మననడతనుగురించియే సంశయించుచు నప్రమత్తులమై నిరంతర మాయనపాదముల సేవించుచుండవలెను. ఆయన మనయభీష్టముల శీఘ్రముగ నెరవేర్ప లేదని నిరాశఁజెందిపరుషవచనము లాడుటగాని విశ్వా సమును వీడుటగాని మనయం దెన్నఁడును గలుగకూడదు. ప్రభుచిత్త మెత్తరివచ్చునోయని నమ్మకముతో నాయనను సర్వదా గొలుచుచుండవలయు. చెట్లయొక్కయు, తీగెలయొ క్కయు పుష్పఫలపత్రములుగాని నదులుమొదలగువాని జలములుగాని మనకుఁ గావలసినప్పుడు లభించుట కష్టము. ఏమనఁగా నవి పరాధీనములు. కావున నీశ్వరపూజకు మన హృదయపద్మమునే సిద్ధపఱచుకొని భక్తిరసముతో నాయన నభిషేకింపవలయు. తాను తల్లికడుపులోనుండఁగనే విదేశమేగి

పెక్కువత్సరములకుఁ దిరిగివచ్చి దనజనకునిగాంచిన కుమారునివలె, ప్రథమమున నాపరాత్పరుని సంబంధమెఱుఁగక యిప్పుడు తెలిసికొని స్నేహము, భయము, సంశయము, ముదము, సిగ్గు, నాశ్చర్యము నను వివిధములైన భావములు మనసునసందడింప నేమియుఁ జేయనేరక నిశ్చేష్టుఁడైయుండెడుభక్తుని భగవంతుఁడే తండ్రివలెఁ జేరఁదీసి వానిజంకుడిపి సంరక్షించును. తండ్రి తనకొసఁగినధనమును దుర్వ్యయము చేసి రోగార్తుఁడై తన్ను రక్షింప నాయనను బతిమాలుకొను కుమారునివలె నాయన మనకొనర్చినబోధనమంతయు దుష్టవర్తనమున వృథపుచ్చి మహాపరాధులమైతిమి కావున మనకిట్టిస్థితియందభయమీయ నాయనను వేడుకొనఁదగు. మనుజులై జన్మించి పశువులవలె సంచరించువారికంటె కేవలపశువులేమేలు. ఏమనఁగా పశువులు తమ కీశ్వరుఁడిచ్చినబుద్ధిప్రకారమొకేవిధముగఁ బ్రవర్తించునుగాని మనుజుఁడు దురాలోచనలు గలిగి యిష్టానుసారముగా నానావిధదుష్కార్యములఁజేయుచున్నాఁడు. కాఁబట్టిభగవదాజ్ఞోల్లంఘనము గావించినందులకై యాతఁడు నిశ్చయముగా దండార్హుఁడగును. కాఁబట్టి మానవుఁడు తనదోషముల నెఱిఁగినవానిని క్షమింపుమని పశ్చాత్తాపముతో నీశ్వరునిఁ బ్రార్థింపవలయును. తీయనైనట్టియుఁ జేదుగలట్టియు బండ్లను కప్పవేయఁగా మన మా

చేదులనేతిని ఘోరవ్యాధులచే నశించుచున్నాము. ఆభగవంతుని పాదధ్యానసుధారసమే దీనికి దివ్యౌషధము. కాఁబట్టి దానిని సేవించి మనమారోగ్యమునుబొందయత్నింపవలయును. పాములు కప్పలఁబట్టికొనునట్లు నరుల పాపములే వ్యాధిరూపమున వారినిబట్టుకొనిక్రమక్రమముగా క్షీణింపఁజేయుట యప్పుడప్పుడు తటస్థించును. కప్పయొక్కయవస్థను వినోదముగాఁ జూచుబాలురవలెఁగాక భగవంతుఁడు కేవలము కరుణాస్వరూపుఁడుగనుక యాతనిఁ బ్రార్థించినయెడల వ్యాధిగ్రస్థులైనవారికిఁ దోడుపడి యాతఁడు వారిబాధల నివారించును. మనహస్తములు దుష్కార్యము లొనర్పకుండునట్లును, మన జిహ్వలు దుర్భాషల పలుకకుండునట్లును, మనయడుగులు నడువరాని స్థలముల నడువకుండునట్లును, మనకన్నులు మొదలగునవి దుర్నయవృత్తులఁ జొరకుండునట్లును, మనహృదయములు క్రౌర్యాదులఁ బ్రవేసింపకుండునట్లును, జేసి మన సేవకుఁదగినవిధముగా వానిఁ బరిశుద్ధపఱుపవలయుననని మనము సర్వదా భగవంతునిఁ బ్రార్థించుచుండవలెను. పొలముకాపును జూడక : పశువులు చేనుమేసినవిధమునఁ బరమాణురూపుఁడై తనప్రపంచమును సంరక్షించుచున్న భగవంతునిఁ గనుఁగొనఁజాలక మన నేత్రములు మొదలగు నింద్రియములు దురాశలందును దుర్నీతియందును, బ్రవర్తించుచున్నవి.

కావునఁ జేనుమేసిన పశువుల బందెలదొడ్డిలోఁ బెట్టుకాపువలె మనకు నరకప్రాప్తిఁ గలిగింపకుండుటకై మనము సదా పరమేశ్వరునిఁ బ్రార్థించుచుండవలెను. మన యింద్రియములనెడు మదపుటేనుఁగులు దురాశలనెడుపిడియేనుగులకులోబడి మనకు స్వాధీనముకాక యుద్వృత్తిని సంచరించును. వానిననురాగమను గొలుసుతోఁ దనపాదములనెడు కట్టుకంబమున బంధింప జ్ఞానమను నంకుశమును బ్రసాదింపుమని మన మీశ్వరుని బ్రార్థించికొనవలయును. కలువపూవులకును దామరపూవులకును బోలుఁడు మడుఁగులోదిగి యందు మున్కలువేయుచందమున సంసారమునందు భోగాసక్తిచే మనమును మోహమను తీగెలఁ దగుల్కొంటిమికావున మనల నుద్ధరించుటకు నీశ్వరుని వేడుకొనవలయును. సముద్రమున బ్రయాణముచేయు నోడవలె సంసారమునం దొకసారి యున్నతస్థితిని బొందుచు వేఱొకసారి నధమస్థితిని బొందుచు నెప్పుడును భయాధీనులమై యుండుమనము దత్భయనివారణార్థమై మనల సరిగా దరిఁజేర్పుమని దైవమునుమనము నిత్యమును ధ్యానింపవలయును. కోపముతోనాయనయొకప్పుడునుమనకుహాని జేయ లేదు. ఇఁకెన్నఁడును జేయఁడు. కలుషాత్ములముకావునమనపాపఫలములే కాలానుసారముగఁ గలుగుచుండ వాని భుజించుచుందుము. ఐనను దైవముయొక్క కారుణ్యపూరముచేఁ బంక

ములన్నియు తొలఁగు నంచు నాదుననుబహుథా వేడుకొనుట యుపయుక్తమగు. ,,ఈశ్వరా' మేముచేసెడునీసేవ నీశక్తినిబఁరీ క్షించుటకుఁ జేయునదికాదు. నిర్మలహృదయముతో నీసర్వశ క్త్యాదిగుణములయందునువిశ్వాసముగలిగి సేవించుచున్నాము. మనస్సును సరిగాఁజూడఁ గలిగిన నిన్ను కించిజ్ఞులగు మనుష్యు లనువలె మేము వంచింపఁగలమా! హృదయములఁ జూచు చున్న నీవు కరుణతో మాసేవ నంగీకరింపు మని మనము పరిశుద్ధులమై భగవంతుని వేఁడుకొనవలయును. మనము తెలి యక చేసిన దోసము లెన్ని యుండునో చెప్పలేము గాని యివి తప్పని మనకుఁ దెలిసి చేసిన దోసములే లెక్కకుమీరు చుండుఁ గావున మన మనస్సు లీసంగతిఁ దలఁచికొనినప్పుడు నిప్పులఁ బొరలు విధముగాఁ బొక్కకమానవు. కాఁబట్టి మన పాపములక్షమించి మన హృయదములఁ జల్లఁజేయుటకై యీశ్వరారాధనము జేయుచుండ వలయు. మన మీవఱ కెన్నియో పాపము లొనర్చియుందుము: మన పాపములు క్షమించుటకుఁ దగని వైనను సర్వము తన్నుగా నమ్మి తన పదములఁ బడువాని నెట్టివాని నైన నీశ్వరుఁడు రక్షింపక పోఁడు. మన మీవిషయములనన్నిఁటినిఁ బర్యాలోచించిన 'నిన పుడు తిత్తు లమరించి వేడి చేసి కరగించినయినుము వలె మన చిత్తములు పశ్చాత్తప్తములై మెత్తనై యుండును. ఆపరి

తాపము తగ్గినయెడలఁ జల్లారినయినుమువలె మనహృదయములు తిరిగి కాఠిన్యమును బొంది చెడిపోవును. కావున నాపశ్చాత్తాపసమయమునందువలెనే సర్వదా మార్దవాదిసుగుణములఁ బొంది యుండునట్లు పరుసవేదివంటి తనకిరుణను మనయెడలఁ బ్రసాదింపవలయు నని యీశ్వరుని బ్రార్థింపవలయును. బాలురను సోమ్మరనాంగ్రము గడచివలె కెక్కించునట్లజ్ఞులమైన మనల నాపరాత్పరుఁడు సర్వోత్తమం బగుమానవజన్మ మెత్తించినాఁడు. ఐనను గడచివలె నున్నయాబాలుని స్థితి వలె మనస్థితియు మిక్కిలి హానికర మైనది కావున మన యున్నతస్థితినుండి పతనమునొందకుండునటుల జాగ్రత్తపడుచు నట్టియపాయ మెప్పు డేని తటస్థించినప్పుడు హానిఁబొందకుండ మనల రక్షింపఁగలవాఁడు దేవుఁడే యని విశ్వసించి మన మాయనను సేవింపవలయును. మనము పాపాత్ములము; పాపమువలననే భూమిని జన్మించుచుందుము. కావునఁ బాపములనే సల్పుచుందుము. అట్టి మనల నిష్పాపులఁ జేయుటకై మన మీశ్వరుని పాదముల కెరగవలయును.

మనము కించిజ్జ్ఞులము. కావున మేలు కీడువలెను కీడు మేలువలెను దోఁచును. సర్వేశ్వరుఁడు సర్వవిదుఁడు. కాన మనకేయేయక్కఱలు కలుగునో వాని నన్నిఁటిఁ దీర్చుటకు మన మాయననే హితునిగాఁ గొని హితాహితములఁ దెలిపి హిత

మునే యాచరించునట్లు మనకు ప్రోత్సాహము కలిగించుటకు సర్వజ్ఞుఁ డగుభగవంతునే ప్రార్థింపవలయును. బిడ్డలు తమకు వచ్చియు రానిమాటలతోఁ గోరు వెట్టనామాటలలోనాయర్థము స్పష్టపడకున్ననుఁ దల్లిదండ్రులు తదుద్దేశముల నూహించియా వస్తువులనిచ్చి వారినేలాగుననూరడింతురో యూవిధముగ నేమన మాటలు మనభావములను సరిగావ్యక్తపఱుపలేకిపోయినను హృదయములఁ గనిపెట్టి మేలుచేయుటకై సర్వాంతర్యామియగు భగవంతుని మనము వేడుకొనవలయును. ప్రపంచమున ఫలవృక్షములందు పండ్లును, తీఁగెలందు పుష్పములును, పైరులందు ధాన్యములును కలుగకుండు నెడల నవి వ్యర్థములు కావున మానవజన్మ మెత్తినమనకుఁ దగినఫలముఁ బ్రసాదింపు మని మనము బహువిధముల నీశ్వరునిఁ బ్రార్థింపవలయును. భగవంతునిచిత్తము మనకుఁ బ్రతికూలమైనప్పుడు ధనములు, ధాన్యములు. గృహములు, వాకిండ్లు, భార్యలు, సంతానములు, సొమ్ములు, భూములు మొదలగు సమస్తసంపదలును మనకుఁ బ్రతికూలములే యగుచుండును గావునఁ దానుమనకుఁ బ్రసాదించిన వన్నియు మన కనుకూలము లగునట్లు లాశీర్వదింపవలయు నని మనము భగవంతునిఁ బ్రార్థింపవలయును. ఇది మేలిది కీ డని తెలిసికొనుటకు మనకు శక్యము కానేరదు. చీఁకటియందు దీపమువలె నాయనను గ్రహింపఁగలిగితిమా, ను

కరమగుమార్గము మనకుఁదోఁచి దురవస్థలు నిర్మూలమగును. కాఁబట్టి కష్టసమయములందు మనకు ధైర్యాదులఁ బ్రసాదించుటకై మనమనస్సును భగవంతునివైపునకే త్రిప్పుకొనవలయును. ఎత్తైనకొండచివర నిలఁబడువానికి, దూరదేశమందున్నవస్తువైన సమీపమందున్న దానివలె నెట్లు గనఁబడునో సూర్యచంద్రులు నేత్రములుగాఁగల విశ్వరూపునకట్లే యాగతానాగతములును వర్తమానమువలెఁ గోచరించుచుండును గావున మనకు సంభవింపఁబోయెడువానిలో విపత్తులున్నయెడల వానిని మనచెంతకురానీయక తొలఁగించి మనలఁ గాపాడవలయునని భగవంతుని మనము వేఁడుకొనవలయును. జననీజనకులు, గురుజనములు, కాంతాసంతానములు, బంధుమిత్రులు, ప్రభుభృత్యులు, దీనులు ననువీరిలో నెవరి నేవిధముగఁ జూడవలయునో వారి నావిధముగఁ జూచునట్లు మనల శిక్షింపవలయు నని మన మీశ్వరునిఁ బ్రార్థింపవలయును. మన శరీరములోని యవయవములు వేఱువేఱుశక్తులు కలవిగను, నొండొంటిసాహాయ్యము నపేక్షించునవిగనుఁ, గోరకుండనే పరస్పరము తోడుపడునవిగను, సృజింపఁబడినట్లే ప్రపంచములోని సమస్తపదార్థములు నిర్మింపఁ బడియున్నవి. అట్టి సృష్టిలోనివార మైన మనమును వానివలెనే యుండవలసిన వారము గాని స్వార్థపరులమై మనశక్తిని మననిమిత్తమే

యుపయోగించుకొనఁ గూడదు. కాఁబట్టి తక్కిన వానివలె మనముగూడ లోకోపకారులమై యుండుబుద్ధిని బ్రసాదింపు మని మనము భగవంతునిఁ బ్రార్థింపవలయును. వనమునందలి యాకులు గాలివీచినప్పు డేరీతిగా రాలి నున్నైపోవుచున్నవో మృత్యువువలన జంతువులును న దేరీతిగా బ్రాణములఁ బాసి మన్నై పోవుచున్నవి. మోక్షసాధనము లైన మన దేహము లితరజంతుశరీరములవలె వ్యర్థముగ నశింపకుండ సార్థకతఁ బొందునట్లు మన మెల్లప్పుడును భగవత్సేవఁ జేసి తత్వజ్ఞాన మును సంపాదింపవలయును. త్రాడుగట్టి లాగుకొనిపోఁబడు పశ్వాదులవలె నింద్రియము లాశలచేఁ దన్నుబంధించి, బలా త్కరించి దుష్కార్యములకుఁ గొంపోవుచుండగాఁ దాను వా నికిలోఁబడిపోతినే యని సిగ్గుబడి దుఃఖించుటకు బదులుగా నింత కార్యము చేయగలిగితి మని మనుష్యులు సంతోషించు చున్నారు. ‚‚ ఈశ్వరా ! నాబాధములఁ ద్రెంపి నన్ను నీసన్ని ధిని జేర్చికొని నాకు నిత్యసుఖము గలిగించు”మని దైవమును మనము ప్రార్థింపవలయును.

‚‚కడియన్న, నోరు తెఱచి కళ్ళె మనిన మాయు” ననులో కోక్తి యథార్థమగునట్లు మనహృదయములు సుఖములకై యాశించును గాని వానిని గలుగఁజేయఁ దగిన యుక్తక్రియల కిష్టపడవు. ఈయ్యనీటివడికి చేప యెదు రేగ నిష్టపడునటుల

మన హృదయములు భగవదాజ్ఞల నాచరింప నిష్టపడునట్లు చేసికొనవలయును. మనమనస్సు చంచలస్వభావము గలజల పూరమువంటిది. నీరు పల్లమునకుఁ బోవున ట్లది సర్వదా హీన కృత్యములఁ జేయుటయం దిష్టపడును. కాఁబట్టి దానిని నిలు కడగా నుండఁజేయుటకై దైవభీతి యనెడు సేతువునడుమ దాని నుంచవలెను. సేతువున కేమాత్రముభంగము కలిగినను నీ రెట్లు నిలువనేరదో యట్లు భగవంతునియెడల మనకు విస్మృతి గలిగినప్పుడు మనస్సు సహజమార్గములనే ప్రవర్తిం చును గాన గట్టు దృఢపఱచుకొనునట్లు భక్తిని సదా దృఢ పఱచుకొనవలెను. అట్లు దృఢపఱచుకొనుట కీశ్వరప్రార్థనమే సాధనముగాన నది మన కర్తవ్యావశ్యకము. ప్రకృతియొక్క యుఁ బరమేశ్వరునియొక్కయు సమ్మేళనమువలన సకలప్రపం చము కలుగుచున్నది. ప్రకృతిధర్మమైనశరీరమునుబట్టి దోష ములును నీశ్వరాంశమైన యాత్మనుబట్టి గుణములును ప్రపం చమునఁ గలుగుచుండును. కాఁబట్టి యితరులు మనయం దే దేని యొకయోగ్యతను గనిపెట్టి మనల మెచ్చుకొను నప్పు డామెప్పు మనదని గర్వపడక యది భగవంతునికే చెందఁ దగినదని తలంచుచును, నట్లే మనయం దయోగ్యతను గని పెట్టి మనల నిందించునప్పుడు మనత పీశ్వరస్వభావమునకు భిన్నముగాఁ బ్రవర్తించెడు ప్రకృతిధర్మమైనశరీరమునుబట్టి

కలిగినది గాన నానింద మనశరీరమునకుఁ జెందఁ దగినదని భావించి దానిని దిద్దుకొనుచును బ్రవర్తించుటకుఁ బ్రయత్న పడుచుండవలెను. తాను ధరించినహారము తనమెడను భద్ర మైయుండగా నది మఱచిపోయి దానికై యెచ్చటెచ్చటనో వెదకు మనుష్యునివలె హృదయమునందు దేజరిల్లుచున్న దేవునిఁ దెలిసికొనలేక యాతఁ డెక్కడనో యున్నాఁడని తద్దర్శనార్థము వేఱ్వేరు స్థలములకుఁ బోవుచుందురు. అట్లుగాక హృద్గతుఁడైన పరమేశ్వరునిఁ దెలిసికొని ధ్యానించికొనుటకై జ్ఞానమును బ్రసాదింపుమని మనము భగవంతుని వేడుకొన వలయును. మన మెవ్వరి నధికముగాఁ బ్రేమించుచున్నామో యట్టి పుత్రమిత్రకళత్రాదు లిహలోకమునందే మనకుఁ దోడు పడఁగలరు గాని పరలోకముల కేగునప్పుడు మనల వెంబడింపఁ జాలరు. ఈశ్వరుఁ డట్లుగాక యిహపరలోకముల రెంటియందును మనతోడ నుండునట్టివాఁడు గావున దారాపుత్రాదులఁ బ్రేమించుదానికంటె నధికముగా భగవంతునే ప్రేమింపవలయును. ధర్మము గెలిపింపు మనియు, దీనులను రక్షింపు మనియు, సదా తనపాదసేవ ప్రసాదింపుమనియు, మా మొర లాలకింపుమనియు, దాను మనయెడలఁ జూపుచున్నప్రేమను మఱువకుండఁ జేయుమనియు, మనతప్పులు క్షమింపుమనియు, సకలపదార్థములకంటె తన్నే యధికముగా

ప్రేమింపఁజేయుననియు మనము భగవంతుని నిరతము ప్రార్థింప వలయును.

మనప్రయత్నము లేకుండఁగనే మనకువచ్చునపాయము లనేకములు తప్పుచున్నవి. దుర్మార్గులు మనలఁ జెఱుపుటకుఁ బ్రయత్నించినను నొక్కొక్కప్పుడు వారి ప్రయత్నములన్నియు మన యుపకారమునకు సాధనము లగుచుండును. ఇట్టివిశేషములకుఁ బిల్లలకుఁ దల్లివంటి యాపరమేశ్వరుఁడే కారణమని మనము నమ్ముకొనవలయును. చక్కఁగాఁ బరిశీలించి చూచుకోఁగలిగినయెడల, మనము మంచివని సంతసించుచున్న యన్నము, పానము, గృహము, శయ్య, యాట, పాట మొదలగు సర్వమునందును మృత్యువే మనకుఁ గోచరించుచున్నది. ఇందువలన, దేనికి మనము వింతపడుచుందుమో యట్టి మృత్యువేమనకు సహజమైనదిగను, దేనిని మనము సాధారణమైనదిగాఁ దలంచుచున్నామో యట్టి బ్రతుకే వింతపడఁదగినదిగాను కనుపడుచున్నది. కాఁబట్టి యనుక్షణమును మనల మ్రింగఁజూచుచున్న మృత్యువును తన యద్భుతమహిమచే దాటించుచు మనలఁ గాపాడుచున్న యీశ్వరుని మన మెంతగాఁ బ్రేమింపవలయునో యూహించుకొనుఁడు. ముల్లును దీయుటకు ముంటి నుపయోగించునట్లు భగవంతుఁడు కష్టములఁ దొలఁగించుట కొక్కొక్కప్పుడు కష్టములనే మజిలఁ

గలుగఁజేయుచుండును కాని యవి మన మేలుకొఱకు వచ్చిన వని యెఱుంగక యందులకై మన మాతని దూషింతుము. ఐనను పర్యవసానమువలన నవి మన మేలుకొఱకే వచ్చినవని తెలియఁబడక పోవుగావున మనము చేసిన యపరాధమును గూర్చి పశ్చాత్తాపపడుచు నికముందెప్పుడు నట్టి యపరాధము చేయకుండునట్లు జాగ్రతపడవలయును. కొన్ని స్వప్నముల వలనను, శకునములవలనను, నేత్రాదిచలనములవలనను భవిష్యద్విషయమును పరమాత్ముఁడు మనకుఁ దెలుపుచునే యుండును. కాఁబట్టి కీడును సూచించెడు స్వప్నాదులు మనకు గలిగినప్పుడా కీడు మన చెంతకుఁ జేరకుండునట్లు మన మీశ్వర సాన్నిధ్యమును జేరియుండవలయును. ప్రపంచమునఁ గొందరికి జననీజనకులు లేకుందురు. కొందఱికి సోదరసోదరీమణులును బంధుమిత్రాదులును గూడ నష్టపోదురు. అట్టి కష్టకాలములయందు దుఃఖములఁ దొలఁగించి వారిని గాచువాఁడా పరమాత్ముఁడే కదా! ఒక గ్రుడ్డివాఁడు తనకు మంచివైద్యుఁ డెవ్వఁడేని సిద్ధాంజనమిచ్చి తన గ్రుడ్డితనమును బోఁగొట్టినయెడలఁ గన్నులుండుటవలని ప్రయోజనము దెలిసికొని జన్మమున్నంతకాలము వాని మేలు నాతఁడు మఱచిపోక వానియెడల గౌరవాదులు కలిగియుండునుగదా! కన్నులుగల మనుష్యుఁ డట్టి పరమోపకారకములైన కన్నులేగాక

తనకీలోకమున నెంతో మేలుకలిగించెడు చెవులు మొదల
యిన యింద్రియములఁ గూడ బ్రసాదించి తనకు మహోప
కారముచేసిన భగవంతుని యపరిమితానుగ్రహ మెుక్కమా
త్రైనఁ దలఁచుకొనకుండు టెంతకృతఘ్నత ! ఈయంశమును
విచారించుకొని తనకుఁ బరమేశ్వరుఁడు కలుగజేసిన సమస్త
మును గుఱించి సదా యాయనయందు నిరుపమానభక్తి
విశ్వాసములు కలిగియుండవలయును.

భగవంతుఁ డొక్కనిముషమైన నుపేక్షించినయెడల లో
కము లన్నియు నిర్మూలము కాగలవు. కాఁబట్టి యాయన స
దా జాగరూకుఁడై ప్రపంచమును గాపాడుచుండును. భక్తు
లకు భగవంతుఁడే దిక్కగనుక వారి ప్రార్థనలను బ్రేమతో
నాలకించి క్షేమమే వారికి సంఘటించుచుండును. ‘‘అడుగ
కుండిన నమ్మయైనఁ బెట్ట.’’ దను సామెత మనలోనున్నది
కదా. ఈసామెతనుబట్టి విచారించినయెడల దేవునిప్రేమ తల్లి
ప్రేమకంటె నెక్కుడై నదిగాఁ దోచుచున్నది. ఏమనఁగా
మనము పుట్టకమును పే మనకుఁగావలసినవన్నియు భగవంతుఁడు
సమకూర్చియున్నాఁడు. మనము మిక్కిలి మూర్ఖులము. కన్ను
లేక, కాలులేక, బాధపడు నంగహీనుల నెందఱనో కన్నులార
జూచుచు నట్టియవస్థలు మనకుఁ గలుగఁజేయని భగవంతుని
కారుణ్యమునకుఁ దృప్తిఁ జెందక యత్యాశతో నెన్నియో

కావలయునని భగవంతుని వేడుకొందుము. మనకు భగవంతుఁడు కలుగజేసిన యింద్రియాదుల నాలోచింపగా వానిముందఱ మనముకోరెడు నవి యేపాటివి ?

పరమాత్మునఁ డజ్ఞానమను చీఁకటినిదొలఁగించునట్టి జ్ఞాన నేత్ర మొసఁగువాఁడు. సంసారరోగబాధలఁ దొలగించుటకు సమర్థుఁడగు వైద్యుఁడు. జగత్తునకు లోవెలినిండియుండువాఁడు. కోటిసూర్యప్రభాభాసమానుఁడు. ఉపనిషత్తులు పొగడెడు పాదములుగలవాఁడు. ప్రపంచమున కంతకు నాధారుఁడు. అతఁడు పురాణపూరుషుఁడు. ఉదయకాలమునఁ బ్రపంచమున నెట్టిమార్పులు కలుగునో యట్టిమార్పులే మనయందుఁగూడఁ గలుగుచున్నవి. ఎట్లనఁగా వేకువను సూర్యుఁడు తనకిరణసమూహమనెడు పొరకకుంచెతో నాకాశమునందు దుమ్మువలె వ్యాపించిన చీఁకటని గ్రమ క్రమముగాఁ దుడిచివేయునట్లు, తత్కాలమునఁ మనకుగలిగెడు తెలివియొక్కకిరణములు నిద్రారూపమైన యజ్ఞానమును క్రమక్రమముగా దొలఁగించును. రాత్రియందు తామరమొగ్గలలో నడఁగియుండు తుమ్మెదలు పైకివచ్చుటకై యాపుష్పముల రేకులను గదలించునట్లు మూతబడిన కన్నులలోనున్న మనచూపులు లోకము మీఁద వ్యాపించుటకై కనుఱెప్పలఁ గదలించును. తూరుపు తెల్లవారగనే పక్షులు మేతలకై నానాదిక్కులకుఁ బోవ నా

రంభించునట్లు మేలుకువరాఁగనే మనయింద్రియములు వేర్వేరు పనులమీఁదికిఁ బోవ నుద్యమించును. భూమియం దొక టెంకపాతి తత్క్షణము దానినుండి యంకురమును, మొక్కను, చివురును, కొమ్మలను, పిందెలను, గాయలను, బండ్లను గలిగించెడు గారడివానివలె, దేవుఁడు రాత్రియం దెక్కడనో మాటుపఱచియున్న మనస్సునుండి యుదయమున సమస్తమైన ప్రపంచము నొక్కమాఱుగాఁ గలిగించుచున్నాఁడు. జనసంచారమంతయు నడగిపోయి సడిచప్పుడు లేకయుండు పట్టణమున రాత్రియం దారక్షకుఁడువోలె యింద్రియప్రచారమంతయు నడగిపోయి సుషుప్తియను నమితమైన యజ్ఞానమున మునిఁగి జడరూపమైయున్న మన శరీరములను తా నొక్కఁడు మేలుకొని జాగ్రత్తతోఁ గాపాడువాఁడా పరమేశ్వరుఁడే కదా! పాలిచ్చి, తొట్లనుంచి, దగ్గరనిలిచి, జోకొట్టి, నిద్రపుచ్చి, బిడ్డను దగ్గరనుండి కాపాడుతల్లివలె మనకు భోజనశయ్యలనిచ్చి, మందమారుతస్పర్శమున నిద్రపుచ్చి, నిశలందు కాపాడువాఁ డా దేవుఁడే కదా!

నవమాసములు మాతృగర్భమున నేవిధమగు జ్ఞానమును లేక జీవమాత్రమున నున్నప్పటివలె రాత్రులందు శయ్యల నిద్రించుచుండెడు మనము శిశువు భూమియం దుదయించినట్లు మఱల మేలుకొనుచున్నాము. కాఁబట్టి మన కన్నులతో

పాపభూయిష్ఠమైన యీ ప్రపంచమును జూడకముందే తొలు దొల్త నాభగవంతుని పాదములను జ్ఞాననేత్రముతోఁ జూడ వలయును. అనఁగా ధ్యానింపవలయును. కఠినములైన వృక్ష శాఖలనుండి మకరందముతోఁగూడిన మృదుపుష్పము లెట్లు జన్మించుచున్నవో యట్లు దేవునికరుణచే మనజిహ్వలయందు మంచిమాటలు కలుగుచున్నవి. కాబట్టి తెల్లవాఱుజామున నాశాఖలు తమపుష్పములను భూమియందు రాల్చునట్లు మన మును విశ్వరూపుఁడైన యాభగవంతుని పాదములయందు మనవాక్యములు సమర్పింపవలయును. అనఁగా మనమాటల నాయన పాదవర్ణనమునకై వినియోగింపవలెను. ఉదయమా దిగాఁ దనకై తనతల్లి నోటఁగఱచుకొనివచ్చెడు నాహారవస్తు వును మ్రింగుటకై గూటిలోనిపిచ్చుకపిల్ల కిచకిచలాడుచు సం తోషముతో నోరుతెరచి పుచ్చుకొని మ్రింగునే గాని యది తన కనిష్టమైన వస్తువును తెచ్చి యిచ్చునని సంకోచింపదు. అట్లే భగవంతుఁడు మనకు దేనిని సంభవింపఁజేసినను నది మన మేలుకొఱకే ఘటించుచున్నాఁడను విశ్వాస మాయన యందు మనము గలిగి సంతోషముతోననుభవింపవలయును.

ఇతరపక్షులవలె కోడి ముక్కుతో నాహారమును తీసికొని వచ్చి తనపిల్లల నోటిలో నుంచక, యక్కడక్కడ నేలనుతన కాళ్ళతో దువ్వఁగా దానిపిల్ల లక్కడకుబోయి తమముక్కు

లతో గింజలు మొదలయిన వేఱకొని తిని బ్రదుకుచుండుట మనము చూచుచున్నాము గదా! ఆలాగుననే తండ్రివంటి భగవంతుఁడు మనలఁ బోషించుటకై యెచ్చోటనుండి మనకు మేలు కలుగవలయునో యచ్చట తాను ముందుగఁ బ్రవేశించి మన కనుకూలముగా నక్కడ జరుగునట్లు తగిన యేర్పాటులు చేసియుండును. మనము కోడిపిల్లలవలె నచ్చటికిఁ బోయి నేర్పుతోఁ బగలంతయుఁ బనిచేసి మనజీవమునకుఁ గావలసిన వక్కడ సంపాదించుకొనవలయును. తల్లినిమఱచి దూరముగా నున్నయెడల గ్రద్దవలన కోడిపిల్లల కెట్లపాయము గల్గునో యట్లే యకృతజ్ఞులమై భగవంతుని మఱచి యాయన పాదములకు దూరమైనయెడల మనకును లోకమున ననేకాపదలు సంభవించును కాఁబట్టి సర్వదాభగవంతుని పాదారవిందము లాశ్రయించి మేలొందవలెను. తెల్లవాఱినతరువాత మన కన్నులు సమస్తపదార్థములను జూడఁగలిగినప్పటికిని మనము చీకటిలోనున్నట్లేయుందుము. అనఁగా మనముందు నుండిగాని వెనుకనుండిగాని పయినుండిగాని ప్రక్కనుండిగాని యేమియాపద మనకు సంభవించునో మనము తెలిసికొనజాలము. కాఁబట్టి గ్రుడ్డివానిని కన్నులుగలవాఁడు చేయూత యిచ్చి మంచిమార్గమునఁ దీసికొనిపోవునట్లు త్రికాలజ్ఞుఁడైన భగవంతుఁడు మనకుఁ దోడై నిరపాయమైన మార్గమున మ

నలఁ బ్రవర్తింపఁజేయున ట్లుదయకాలమున నాయనను బ్రార్థింపవలయును. దేవుఁడు మన తలపుల కందనివాఁడు. పాపసముద్రమును దాటించుట కోడవంటివాఁడు. కరుణయందు తుదముట్టినవాఁడు. దీనులకు రక్షకుఁడైనవాఁడు. సేవచే బ్రీతుఁడగువాఁడు. పరాత్పరుఁడు. మేలుచేయువాఁడు. జ్ఞానస్వరూపుఁడు. సకలమునకుఁ బ్రభువైనవాఁడు. శాశ్వతుఁడైనవాఁడు. రోగములేనివాఁడు. సాటిలేనివాఁడు. అద్భుతమైన దివ్యమహిమగలవాఁడు. జీవమున కాధారమైనవాఁడు. మోక్షమును గోరువారి హృదయమున నుండువాఁడు. కాఁబట్టి యాయనను సేవించి తరింపవలయును. తమతమ మేతపట్లకుఁ బోయిన పక్షులు సాయంకాలమున గూండ్లకుఁ జేరుకొను నట్లే తమతమ యుద్యోగస్థానాదులకుఁ బోయిన మనుష్యులు కార్యముల నిర్వహించుకొని తిరిగి సాయంకాలమున కిండ్లకుఁ జేరుకొనుచుందురు. కాఁబట్టి తాము దినమెల్లను జేసెడు కృత్యములలో గుణదోషములు భగవంతునకుఁ దెలిసియుండును గనుక దోషములను క్షమింపుమని ప్రతిమనుజుఁడును సాయంకాలము శయనసమయమున భగవంతునిఁ బ్రార్థింపవలయును. సాయంసమయమున వీధులలో నాటలాడుకొని తలనిండ నొడలునిండ దుమ్ముపోసికొని యింటికివచ్చిన పిల్లవానిని తల్లి చేరఁదీసి యొడలి దూళియంతయుఁ బోవు

నట్లు వానిని స్నానముచేయించి శుభ్రపఱుచును. ఆలాగుననే ప్రేమగల భగవంతుఁడు పగటియందు మనము చేసినతప్పులను తన యపారకారుణ్యమున క్షమించి మనల నిర్మలులఁ జేయుమని శయనసమయమున నాయనను ప్రార్థించికొనవలయును. రాత్రి నిద్రావస్థయందు మన కేదుస్స్వప్నములును రాకుండుటకునై యాయన నామమంత్ర ముచ్చాటనకై జపింపవలయును. ఎన్నో యుపకారము లాయీశ్వరుఁడు మనకుఁ జేసియుండఁబట్టియే మన మిట్లు వర్థిల్లుచున్నాముకాన ప్రతిసాయంకాలమును నొక్కసారి యాయనను సుఖనిద్రకై స్మరించుట యావశ్యకము. మన రహస్యకార్యములను భగవంతుఁడు కనఁజాలఁడని భావింపవలదు చీఁకటినైనఁ జూడఁగల కన్నులుపిల్లికేయిచ్చిన భగవంతుఁడు మన రహస్యములఁగనుఁగొనఁజాలఁడా! విదేశ మేగునప్పుడు మనుష్యుఁడు తన వస్తువులను తన స్నేహితునియొద్ద దాచుకొని భద్రమొనర్చుకొనునటుల మనము నిద్రపోవునప్పుడు మన శరీరాదుల నా పరమేశ్వరునికడఁ దాచుకొనవలయును. మనము పాడొనర్చుకొనిన వేవేని వానియం దున్నయెడల భగవంతుఁడు వానిని బాగొనర్చి తిరిగి మన కీయఁగలఁడు. నిశ్చలభక్తితో నీశ్వరునిఁ బ్రార్థించు మనుష్యున కిహమున సర్వసంపదలును, బరమున

భగవత్సాన్నిధ్యమునుఁ జేకుర్పఁగలదు. అప్పుడే మన జన్మము సార్థకమైన దగును.

ఆర్యులారా! నాబూనిన పని నేను సాంతముగ నిర్వహించితిని. ఇందలి గుణాగుణంబులకు పాఠకులే ప్రమాణము.

నాప్రయత్నము శ్లాఘాపాత్రమని మిత్రు లాదరింత్రుగాక!

[శ్రీ పరమేశ్వరార్పణమస్తు.]

